సంపుటము 3] మే 1917 [సంచిక 11

# బాలమిత్ర



## కాకీ హుబాత్

అక్క దాచిన ♦ లక్క పిడతలు
చెల్లెతీసుక ♦ చేతబట్టెను
అక్క వచ్చి ♦ ఆడనిలచి
టక్కు మాటలు ♦ చాలబలికి
"కాకీ హుబాత్త" ని ♦ అటులజూచి
"కాకీ హుబాత్త" ని ♦ ఇటులజూచి
చెల్లెచేతి ♦ లక్క పిడతలు
లాగుకొని తా ♦ వేగి పోయెను.

## వృథాచేయనియెడల లేమికలుగదు-

రాజీ, నీకు పెట్టిన అన్నమంతా తినవలెను. రాజి తనకు పెట్టిన అన్నము కొంచెము వదలిపెట్టెను.

"నా కదివద్దే. ఇష్టములేదు"

“పరవాలేదు. తిని తీరవలెను”

“కూర కలవలేదు. ముద్ద దిగుటలేదు.”

ఇంకాకొంచెము కూరఉంటే తినవచ్చునని రాజి తలంచెనుగాని కూర, చట్టిలోను లేకపోయెను. పెరుగన్నము తిందామనుకొంటే, తనకు పెట్టినదంతా తింటేనేగాని ఏమి పెట్టదని వానికి తెలియును. ఏమియుతోచక కొంచెముసేపు కూర్చుండెను. తరువాత ఏమో తోచినందున ముఖమొక విధముగా పెట్టుకొని;

“అమ్మా! నీవు నాఅంత ఉన్నప్పుడు, నీకు పెట్టినదంతా తిన్నావా”? తల్లికి నవ్వువచ్చెను.

“ఔను తిన్నాను. ఒకనాడు మాఅమ్మ పెట్టిన అన్నము తినక కొంచెము మిగిల్చి ఆమెకు తెలియకుండా గిన్నెఅంచు వెంబడి దానిని పెట్టితిని. సాయంకాలము తినేటప్పుడు నా గిన్నెలో ఒకమూలను జాగ్రత్తగా నేను మిగిల్చినదానిని చూచితిని వెంటనే దానినితీసి పారవేయబోతిసిగాని మా అమ్మ ‘బిడ్డా! మధ్యాహ్నము నీకు పెట్టినదంతా నీవు తింటేనే తప్ప ఇప్పుడేమియు పెట్టనన్నను. నేను దానిని తినుట తప్పకపోయెను. గనుక అప్పటినుంచి పెట్టినదంతయు తినేదానను.

ఇది చెప్పేసరికి రాజి గిన్నెలో మిగిలినదంతా అయిపోయెను. తల్లినేర్పిన బుద్ధిమాటల ప్రకారము చేసెను.

# ఐస్లండ్ దీవిలోని గృహము



మన యిండ్లకును ఐస్లండ్ ద్వీపస్థుల యిండ్లకును, ఎంత తారతమ్యమున్నది! అయినను ఇతర స్థలములలో

నున్న రాచమందిరములలో నివసించువారికంటె ఈ ద్వీప నివాసులలో ననేకు లెక్కువ సౌఖ్యవంతులై యున్నారు.

ఐస్లండ్ ద్వీపవాసుని గృహము ఒక అంతస్థు యిల్లయి యున్నది. ఇట్టివి కొన్ని చేరియున్న యొక కాపువాని నివాస భూమి యొకచిన్న పల్లెటూరివలె కనుపించును. గోడలు ఒకతరహా చెక్కతోగాని, కరగి గట్టిపడిన రాతిముక్కలతో గాని కట్టబడును. మధ్యమధ్య సందులు మట్టితోనైనను తృణ జాతి చెట్లతోనైనను పూడ్చబడును. ఇవి 4 అడుగుల ఎత్తును 6 అడుగుల మందముగలవై యున్నవి. సాధారణముగా మనవారు ఇండ్లను కట్టునప్పుడు పెద్దపెద్ద కొయ్యముక్కల నుపయోగింతురుగాని ఈ దీవిలోనివారు తిమింగిలపు ఎము కలను తెచ్చి వాటిని మన్నుతోను పాచితోను కప్పి గడ్డి మొలవ నిత్తురు అవి గట్టిపడినవెనుక ముక్కలుగాకోసి ఉపయో గింతురు.

మనము వాకిటిగుండా వారింటిలోకి వెళ్లుదము రమ్ము. ఇది ముఖ్యగదిలోనికి తీసికొనిపోవు దోవ. ఈగదిని భోజనము నకును, నిద్రించుటకును, కాలక్షేపము చేయుటకు నుపయో గింతురు. ఈ దోవనుంచి వేరేగదులకుపోవు మార్గములు నున్నవి. వీనిని సాధారణముగా నౌకరులు వాడుకొందురు. కొన్నిటిని వంటశాలలుగాను, పాడికొట్టములుగా నుపయో గింతురు. కొంచెము కలిగినవా రింటిలోని పెద్దగది గోడలకు



చెక్కలు కొట్టుదురు. కిటికీలకు అద్దములు వేతురు, చాల ఇండ్లకు వెలుతురుకొరకై కప్పులో రంధ్రములు చేతురు. చర్మము కప్పబడిన కడియములు వానికి తగిలింతురు.

ఈ యిండ్లలో పొగపోవుటకు గొట్టములుండవు. హాయిగా చలి కాచుకొనుటకు చలిమంట లుండవు. మిక్కిలి చలి దినములలో సైతము వంటశాలలోతప్ప మరెక్కడను నిప్పు కానరాదు. పొగ పైకప్పు రంధ్రములద్వారా వెళ్లవలసి

యున్నది. తమకు మిగుల ఉపయోగకరములగు పనిముట్లను వారు కష్టపడి తగిలింతురు. అయితే గదికిమూలలను వింతగా కనుపడున దేమిటి? అదేపడక. దానినిండ ఈకెలు మెత్తని యితరవస్తువులున్నవి. వాటిపైన తోళ్లనువేసి, అన్నిటికిపైగా దుప్పటిపరతురు.

ఆ దీవినివాసుల యిండ్లు మురికివనియు, అంత బాగుగా ఉండవని తలంతురా? అవి బహు చిన్నవిగనుక అలాగే ఉండవచ్చును. కొంచెము భాగ్యవంతులు వానిని చాలినంత శుభ్రముగానుంచ యత్నింతురు. వారు ఇంకాకొంచెము పెద్ద యిండ్లు కట్టుకొని మంచిగాలి రానిచ్చుచున్నారు.

---

## మట్టి తొట్టిలోని వింత

మట్టితొట్టితో ఆడుకొనుట అయినది. ఆడి ఆడి రత్నముకు విసుకు పుట్టినది. ఆడుకొనుటకు దేనినైనను తెమ్మని తల్లిని తొందర పెట్టువాడు. తల్లి దేనినైనను ఇచ్చినయెడల కొంతసేపు ఆడి మరియొకటి కావలెనని కోరువాడు. ఆడిన దానితో నాడుటకు వాని కిష్టములేదు. ప్రతిసారి క్రొత్తది కావలెను. ఒకదానితో నాడుకొనుచుండగా, దీని తరువాత దేని నిత్తునా అని తల్లికి ప్రతిసారి యొక గొప్ప ఆలోచనగా

నుండునది. మట్టితొట్టితో రత్నమాడుకొను చుండునప్పుడు తల్లిలోన పనిచూచుకొనుచు, రత్నముయొక్క ఆటవస్తువును గూర్చి తలంచుచుండెను. చాలకాలమునరకేమియు తోచలేదు.



„సరే సరే, ఇదిగో ఇక్కడ కొన్ని గోగువిత్తనములు, చెనగగింజలు, చిక్కుడుగింజలున్నవి. వీనిని ఆ తొట్టిలోవ్వాతి తరువాత జరుగుదానినిగూర్చి రత్నముకు చెప్పెదను” అని తలంచెను.

„అమ్మా, నాకీపాడు తొట్టెవద్దు. దీనిని తీసిపారవేయి ఇంకొకటేదైనా ఇమ్ము. లేకుంటే దీని పగులగొట్టెదను” అని రత్నము చెప్పెను.

„వద్దు వద్దు, నీకొక కొత్తఆటను నేర్పుదు బహు తమా

పోగా నుండును." అని తల్లి త్వరగావచ్చి, ఆ తొట్టిని మట్టి తోనింపి, కొన్ని చిక్కుడుగింజలను, శెనగగింజలను మట్టిలో పాతి నీళ్లుజల్లెను. రత్నము ఏమిటా యిదియని తలంచెను. నీళ్లుజల్లుచు తల్లి "రత్నమా! నేను చల్లునీళ్లు వాన ఇంకా రెండు మూడు రోజులలో ఏమి జరుగునో తెలియునా?" అని అడిగెను. రత్నముకు తెలియులేదు. తల్లియు చెప్పలేదు గాని ఆ తొట్టిని బైట కిటికిలోనుంచి దానిని తాను చెప్పువరకు ముట్టవద్దని రత్నముతో ననెను గాని రత్నము తొట్టి మరల కావలెనని కోరెను.

వాని మంకుతనము మాన్పుటకు తల్లి వానిని షికారు పోవుదము రమ్మని ఒక తోటలోకి తీసికొనిపోయెను. అక్కడ నేలపై వేపవిత్తనములు పడి చిన్నచిన్న మొలకలు బైటకు వచ్చెను. తల్లి వానిని జూపి అవెట్లు వచ్చినవని రత్నము నడిగెను. వానికి తెలియులేదు గాని అదంతయు వానికి చాల వింతగా నుండెను. తరువాత యింటికివచ్చిరి. రాగానే వాడు తొట్టివద్దకు బోయెను. దానిలో ఏమియు కనబడలేదు.

రెండు మూడు దినము లైనపిమ్మట ఆ తొట్టిలో చిన్న మొక్కలు చాల కనుబడెను. వాని ఆశ్చర్యమునకు మితము లేకపోయెను. తల్లి ఒకదానిని పీకి వానికి చూపెను. కొంత మట్టిలోనికి పోయియుండెను. మరికొంత బైటికివచ్చెను. తల్లి నాటినవిత్తులు కనపడలేదు. ఆవేమైనవని తల్లిని విచారించెను.

అప్పుడామె వానికి ఆ విత్తనము ఒక చక్కని పెట్టెయనియు, దానిలో ఇప్పుడు కనుపడుచున్న పెద్దమొక్క చిన్నదిగా నుండి దాగియుండెననియు చెప్పెను. రత్నముకు ఈ ఆట తక్కిన ఆటలకంటె చాల బాగుండెను. ఇంక రెండు మూడు మొక్కలను పెరికిచూడగా లోనకుబోయిన భాగములు ఒకటే మాదిరిగాను, పైకి వచ్చిన వన్నియు ఇంక ఒకమాదిరిగా నుండుట చూచి, విత్తనములు తలక్రిందుగా వేసినయెడల ఎట్లుండునని అడిగెను. తల్లి వానికి మరికొన్ని విత్తనము లిచ్చి వాని కిష్టమువచ్చినట్లుగా పాతుమని చెప్పెను రత్నమట్లు చేసెను. మరికొన్ని దినములకు తరువాత, వాడు, చూడగా పైకి వచ్చునది అన్ని మొక్కలలోను పైకే వచ్చినట్లును, లోనికి బోవునది విత్తన మెట్లున్నను లోనికే బోయినట్లును చూచి చాల వింతయని తలంచెను. తల్లి వానికాసంగతి విశదపరచు దేవుడెట్లు చిన్నమొక్కలను, పిట్టలను, జంతువులను, పిల్లలను గూర్చి జాగ్రత్త పుచ్చుకొనుచున్నాడో చెప్పెను. అప్పటినుండి రత్నముకు విత్తనములనునాటి అవి మొలచి పెరుగుచుండగా కనుపెట్టుటకు బహుగా కోరెడి వాడు. అతనికి మట్టితొట్టి చాల మంచితొట్టియాయెను. చిన్నమొక్కలను జాగ్రత్తగా కాపాడి వానిని పెంచి పెద్ద వానినిచేయుట కెంతో ముచ్చటగా వానికుండేది. నిజముగా ఇట్టి ఆటలు చాల ఉపయోగకరమైన ఆటలై యున్నవి.

# ప్రకృతి పాఠములు

## 33 వ_పాఠము

## ఎముకలు

మనము మన మనస్సుద్వారా యెట్లు మనచుట్టునున్న ప్రపంచములోని సంగతులను తెలిసికొనుచున్నామో ఇదివఱకు చదివి యుంటిమి. ఇదిమాత్రమేగాక మనస్సు మరి యొక పనినిగూడ జేయుచున్నది. శరీరములోని ఆయా భాగము లేపనిని జేయవలెనో దెలుపుచు వానిచేత జేయించు చున్నది. కండలు అని మనము సాధారణముగా చెప్పు కండర ములవలన ఈ పనులను అనేకవిధములుగా జేయించుచున్నది. నీవు మాట్లాడునప్పుడు గొంతు, నోరు, రొమ్ములోనుండు కండరములు పనిని జేయుచున్నవి. వ్రాయునప్పుడు చేతిలోని కండరములు మనస్సు చెప్పునట్లు వ్రాయుచున్నవి. ముఖ ములో సంతోష భయదుఃఖ సూచనలు కనుబడునప్పుడు అది ముఖము, మనస్సులో నెట్లున్నదో, ముఖమందలి కండర ములచే దెలుపుచున్నది. మనస్సు ఆయా కండరముల కాజ్ఞ లిచ్చు యజమానిగా నుండి వాని పనులను జేయించుచున్నాడు. ఏ పనులు జేయించవలెనో మనస్సున కెట్లు తెలియునని అడుగవచ్చును. మన ఇంద్రియములకు కండ్లు, చెవులు, మొదలగువానిద్వారా మనస్సు వానిని తెలిసికొనుచున్నది.

గనుక ఇంద్రియములగు కండరములు మనకు గొప్పమేలును జేసినవగుచున్నది.




ఎముకలు ఈ కండరములచే కదలించబడుచున్నవి. నీవు నీభుజమును ముడుచునప్పుడు క్రింది ఎముక దండచేతిపై బడుచున్నది. మోచేతివద్ద ఒక కీలువలన ఇట్లు కదలింపగలుగుచున్నాము ఇట్టి కీళ్లు శరీరములో అనేకములు గలవు. ఈ కీళ్లిట్లు అటు యిటు కదలుచు తిరుగుచుండునప్పుడు అరిగిపోకుండునట్లు చేయబడినవి ఒకడెన్నియేండ్లు జీవించినను అవి అరుగుట లేదు. బండి చక్రములు చక్కగా తిరుగుట కేమి చేతురో చూచి యుంటివా? క్రొవ్వుగాని నూ

నెనుగాని ఆ యిరుసులో పోయుచుందురు. అట్టే ఎముకల కీళ్లయందును ఎప్పటి కప్పుడు ఒక విధమైన నూనె ఊరి అది అరుగకుండునట్లు జేయును.

శరీరములోనున్న ఎముకలనన్నిటిని ఉన్నపాటుననే ఉంచి తక్కిన రక్తమాంస చర్మముల నన్నిటిని తీసివేసినయెడల అది యొక చిత్రమైన పంజరమువలె నున్నది. ఇంటికి దూలములు మొదలగు కలపవలెను, గొడుగుకు బెత్తములవలెను, శరీరమునకు ఎముక లట్లున్నవి ఆకారమును ఎముకల వలననే కలుగుచున్నవి. ఎముకలు లేనియెడల నిలుచుటకు గాని, కూర్చుండుటకుగాని వీలులేక, నడువజాలక పోదుము. పురుగు వలె ప్రాకవలసి యుండును.

ఎముకలు వివిధరూప పరిమాణములు గలవి తలలోని ఎముక లన్నియు జేరి గుండ్రని పెట్టెవలె నున్నవి. దీనిలోనే మనస్సున కాధారమగు మెదడున్నది. శరీరమంతటికి గవర్నరుగారైన మనస్సుయొక్క ముఖ్యపట్టణ మిదియేనని చెప్పవచ్చును. ఈ గుండ్రని కపాలము బహు బలముగలది.

రొమ్ము ఎముకలన్నియు గలసి మరియొకతరహా పీపావలె నున్నవి. ప్రక్కటెముకలు పీపాచుట్టునుండు ఇనుపరేకులవలెనున్నవి. వీనికిముందు బోరఎముకయు వెనుక వెన్నెపూసయు గలవు. మనము ఊపిరి పీల్చునప్పుడు ఇవి వెనుకకు

ముందుకు కదలునట్లు ఏర్పరుపబడియున్నవి. ఈ పీపాయి లోపల హృదయము ఊపిరితిత్తులు నున్నవి.

(సశేషము)

---

# బైబిలు పిల్లలు

## ఎస్తేరు

ప్రియ బాలమిత్రులారా!

మీలో నెంతమందికి ఎస్తేరురాణినిగురించి తెలియును? ఈమె యూదురాలు బహు చక్కనిది. యూదుల ఆచారములలో పెంచబడినది. యూదులు చెరకు కొంచు పోబడిరి. ఎందులకు? వారి నధికముగా ప్రేమించిన యెహోవాను విడిచి ఆయనకు హేయమగుపనుల జేసిరి. గనుకనే ప్రభువు వారిని శిక్షించి అన్యుల ఆధీనమున ఖైదీలగా పోవునట్లు చేసెను. పారసీకదేశములో ఇట్లు కొంచుపోబడిన యూదులలో మొర్దెకై యొకడు. ఇతను తన అన్నకుమార్తె యగు ఎస్తేరును పెంచుచుండెను. ఈమె అతి సుందరియని పారసీకులు మెచ్చి రాజుగారి భార్యయగు పదవి నామె కిచ్చిరి. ఆమె రాణిగా నున్నప్పుడు యూదులకు కొంత కష్టము వచ్చెను. అసూయ బహు చెడ్డది. కొంపలకూల్చి బంధు

వుల ఎడబాయునట్లును, స్నేహితుల విసర్జించునట్లు ఇట్లనేక కీడులుగా ఎంచును. యూదులు పారసీక రాజుగారియొద్ద



యున్నతపదవి నొందియున్నారని, రాజు సన్నిధిని పనిజేయు వారలలో నొకడగు హామానుజూచి, రాజు చెంతజేరి లేని

పోనిమాటల యాదులపై జెప్పి రాజుగారి యాగ్రహా మునకు వారిని అప్పగించనై యున్నప్పుడు దేశాభిమానము గలిగిన ఎస్తేరురాణి గొప్పస్థితిలో తన బీద బంధువర్గమును మరువక వారిపక్షమున స్తంభముగానిలిచి రాజుగారి కటా క్షము వారికి కలుగునట్లు వేడుకొని వారికి గొప్పమేలు జేసెను. బాలమిత్రులారా! మనకు గొప్పస్థితి వచ్చినను మనవారిని మరువక వారికి శక్యమైనంతవరకు మేలుజేతము.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ప్రియమైన బాలమిత్రను చదివెడు బాలికా బాలులారా మాతండ్రి ప్రతి నెలయు ఒక బాలమిత్రను తెప్పించి నాకు యిచ్చుచుండెను. దానిని నేను చదివి సంతోషముగా ఒక ఉత్తరము బాలమిత్రటపాకు వ్రాయుటకు నాకు ఉల్లాసము కలిగెను.

మా స్కూలులో విద్యగరపు మేమందరము యెనుబదిమందిమి. మేము ప్రతిదినము ఉదయము, సాయంత్రము ఆత్మీయమైన దైవ ఆరాధనతోను స్కృవేద పాఠముతోను ఆరంభించుచు, విద్య నభ్యసించుచున్నాము. మొగ పిల్లలము ఆడపిల్లలము కలసి ప్రతి ఆదివారము సాయంకాలము $2\frac{1}{2}$ గంట మొదలు 4 గంటలవరకు బాలుర క్రైస్తవయత్న సమాజము జరుపుదుము. ఆ కూటమును మేము ప్రార్థనతోను, కీర్తనలు పాడుటతోను బైబిలు చదు వుటతోను దానిని జరుపుదుము. ఆ కూటము అయిపోయిన తరువాత మేము కొంతమందిమి కలసి చుట్టుప్రక్కలనున్న గ్రామములకువెళ్లి బోధించివత్తుము.




మమ్ములను తెలివిలోనికిని మర్యాదలోనికి తెచ్చినటువంటి ఎ. యం. లింకరు మిసమ్మగారు నవంబరు నెలలో వివాహమాడి వెళ్లినారు. వారికి బదులుగా యి. పి. బాలర్డు మిసమ్మగారు వచ్చియున్నారు. లింకరు మిసమ్మగారు 7 వ. తరగతి రికగ్నైషణ్ చేసి వెళ్లిరి.

చాలా కాలమునుండి నేనుకూడా ఒక ఉత్తరము వ్రాయవలయునని కోరుచుంటిని యిప్పుడు నా కోరిక ఈడేరినందుకు దేవునికి వందనములు చెల్లించుచున్నాను.

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు,

మల్లెల ఉల్యాముకేరి, నర్సరావుపేట

C. L. S. PRESS, MADRAS—1917